# కాళిదాసు



రచయిత

కె.టి. పాండురంగి

అనువాదం

వారణాసి జానకీదేవి, ఎం.ఏ., బి.ఇడి.

ప్రధాన సంపాదకులు

ఎల్.ఎస్. శేషగిరిరావు



భారత భారతి పుస్తక మాల

( తెలుగు సంస్కరణ )

3-4-852, బర్కత్‌పురా, హైదరాబాద్ - 27

# కాళిదాసు



రచయిత
కె. టి. పాండురంగి

అనువాదం
వారణాసి జానకీదేవి, ఎం.ఏ., బి.ఇడి.

ప్రధాన సంపాదకులు
ఎల్.ఎస్. శేషగిరిరావు



భారత భారతి పుస్తక మాల
( తెలుగు సంస్కరణ )
3-4-852, బర్కత్‌పురా, హైదరాబాద్ - 27

ప్రచురణ కర్తలు :
నవయుగ భారతి ప్రచురణలు
పోస్ట్ బాక్స్ నెం. 1041
నారాయణగూడా, హైదరాబాద్ - 29

తెలుగు సంస్కరణ సంపాదకులు :
టి. హరిహరశర్మ

ప్రథమముద్రణ:
4 జులై , 1997

వెల : రూ. 6/-

ప్రతులకు :
సాహిత్యనికేతన్
3-4-852, కేశవ నిలయం
బర్కత్‌పురా, హైదరాబాద్ - 27

# ఇది మా మాట

కేవలం భారతదేశంలోనే కాక, మొత్తం ప్రపంచంలోనే ప్రఖ్యాతులైన మన పూర్వీకులను స్మరించడం, వారి జీవితాలను అధ్యయనం చేయడం ఎల్లప్పుడూ ప్రేరణదాయకంగాను, మార్గదర్శకంగాను ఉండగలదనడంలో సందేహం లేదు.

మన చరిత్రకే వన్నెతెచ్చిన ఆ మహనీయుల జీవితాలను సరళమైన, ఉత్తేజకరమైన భాషలో ప్రజలకందించే చక్కని ప్రయత్నాన్ని రాష్ట్రోత్థాన పరిషత్, బెంగుళూరు వారు ప్రారంభించారు.

'నవయుగభారతి' ఆ పుస్తకాలను తెలుగులోకి అనువదించే బృహత్కార్యాన్ని చేపట్టింది. భారత భారతి పుస్తకమాల రూపంలో మీ చేతుల్లో ఉన్న పుస్తకాలు ఆ ప్రయత్న ఫలితమే. మన చరిత్రలోని మహాపురుషుల జీవితాలు ఈ పుస్తకమాల ద్వారా మీకందించబడతాయి.

అమరమైన , అనంతమైన మన గత చరిత్ర అనే అమృత స్రోతస్సును తరువాతి తరానికి అందించగలుగుతున్నామనే సంతృప్తితో ఈ పుస్తకాలను మీ ముందు పెడుతున్నాం. మీరుకూడా ఈ కృషిని ప్రశంసించగలరని, ప్రోత్సహించగలరని ఆశిస్తాను.

మూల రచనను సరళమైన, ఆహ్లాదకరమైన రీతిలో తెలుగులోకి అనువదించిన అనువాదకులకు ధన్యవాదాలు.

హరిహర శర్మ

సంపాదకులు

# మహాకవి కాళిదాసు

విక్రమాదిత్యుని ఆస్థానంలోని నవరత్నాలలో కాళిదాసు ఒకరు. సంస్కృత సాహిత్యానికి ఆయన ఎనలేని శోభను చేకూర్చారు. అలనాటి దేశకాల సంస్కృతులను ఆయన రచనలు అద్భుతంగా చిత్రీకరించాయి. ఆ మహాపురుషుని జీవన గాథ ఇది.



ప్రపంచంలో వేలకొలది భాషలు వాడుకలో ఉన్నాయి. కాని మనం గొప్పది, సొగసైనది, అన్ని దేశాల ప్రజలు చదవడానికి ఉత్సాహం చూపేది అయిన సాహిత్యం కేవలం కొన్ని భాషల్లోనే మనకు లభిస్తోంది. దానిలో ఒకటి 'సంస్కృత భాష'. ఇది ప్రాచీనమైన భాషలలో ఒకటి. అనేక భాషలకు తల్లి వంటిది. హిందీ, బెంగాలీ, మరాఠీ, కన్నడం, తెలుగు మరియు దక్షిణాదిలోని ఇతర భాషలన్నీ దీని నుండి ఉద్భవించినవే.

భాషను ప్రపంచ విఖ్యాతం పొందించాలంటే అసాధారణ తెలివి (పాండిత్యం) గల కవులు, గొప్ప ఆలోచనాపరుల ఆవశ్యకత ఎంతైనా ఉంది. ఈ దృష్టిలో

సంస్కృత భాష చాల అదృష్టవంతమైనది. ప్రకృతిలోని చమత్కారము, ఆకాశము, నక్షత్ర ములు, పర్వత్రాలు, నదులు, సూర్యుడు, చంద్రుడు, మేఘములు మొదలైన వాని సృష్టి ప్రారంభం జరుగుతోంది. విశ్వశక్తి యొక్క ఈ వేడి కోలు (ప్రార్థన) వేదాలలో లభిస్తుంది. ఈ వేద ములు సంస్కృత భాషలో ఉన్నాయి. పురాణాలు సంస్కృతంలో ఉన్నాయి. ఇతిహాస పురాణ గ్రంథాలయిన రామాయణం, మహా భారతం కూడ సంస్కృతంలోనే ఉన్నాయి. మంచి చెడుల సంఘర్షణ వీనిలో మిక్కిలి స్పష్టంగా వర్ణించ బడింది. సత్యము ఎడల ఆసక్తి, త్యాగ భావన, పరాక్రమము, సభ్యత మొదలైన వానిని ఈ గ్రంథాలు చూపుతున్నాయి. పశుపక్ష్యాదులు పాత్రలుగా గల అందమైనకథలు మనకు పంచ తంత్రంలో లభిస్తున్నాయి. ఈ కథలన్నీ సంస్కృత భాషలో ఉన్నాయి. ఈ కథల ద్వారా మంచి గుణాలు, నేర్పరితనం, తెలివితేటలు ప్రశంసించబడ్డాయి. సంస్కృతంలో నాటకములు, కవితలు, వైజ్ఞానికమైన, చూడవలసిన లేఖలు- యొక్క నిధి చాలా ఉంది.

సంస్కృత సాహిత్యానికి ఒక విశిష్టత, మిక్కిలి యోగ్యత కల్పించిన మహా విద్వాంసుడు కాళి దాసు. ఆయన తన సాహిత్యంలో జీవిత సౌందర్య వర్ణన చేశాడు. మనం మన ఉదారత, ప్రేమ పూరిత వ్యవహారంతో రెండవవారిని ఎట్లా ప్రసన్ను లను చేసుకుంటామో- ఇదే విషయం గూర్చి ఆయన తన ఆలోచనా విధానాన్ని మనకందిం చాడు. ఆయన వర్ణన స్పష్టంగాను, హృదయాన్ని హత్తుకునేదిలా వుంటుంది. ఆయన శబ్దశాస నము (మాటలను, పదాలను తూచి వాడడం) అద్వితీయము. తను చెప్పదలుచుకున్నది ఆయన సంక్షిప్తంగా, అతి సుందరంగా చెబుతాడు. ఆయన రచన ఉత్తమము. అర్థవంతమైన జీవన చరిత్ర విధానాన్ని తెల్పుతుంది. అతని రచనలు పండితులకు, పామరులకు సమానంగా ఆనందాన్నిస్తాయి.

## పండితుడు, కవి

కాళిదాసు ఎవరు? ఆయన ఎపుడు, ఎక్కడ నివసించే వాడు? ఈ విషయంలో ఎన్నో వివాదాలున్నాయి. దీనికి ఒక నిశ్చితమైన సమాధానం లభించదు. అనేక పౌరాణిక కథలు

(పురాణ కథలు) ఈ విషయంలో కల్సి వున్నాయి. ఒక కథలో ఆయన ఒక బ్రాహ్మణ కుమారుడని, ఆరు మాసముల వయసులో ఉండగా, ఆయన తల్లిదండ్రులు మరణించారని చెప్పబడింది. ఒక పశువుల కాపరి అతనిని పెంచి పెద్ద చేశాడు. ఆయన ఎన్నడూ బడికి వెళ్ళలేదు. ఆ సమయంలో కాశీరాజుగా 'బీమశుక్లుడు' వుండేవాడు. ఆ రాజు తన కూతురు 'వాసంతి' వివాహం, దర్బారులో పండితుడైన 'వరరుచి'తో చేయాలనుకున్నాడు. కాని రాజకుమారి నిరాకరించింది. ఆమె వరరుచి కంటె తాను ఎక్కువ పండితురాలినని (పాండిత్యం కలదానిని) అంది. దీనితో వరరుచికి కోపం వచ్చింది.

ఒకరోజు రాజుగారి మంత్రి ఈ గొల్లపిల్లవాడిని చెట్టు మీద కూర్చుని కూర్చున్న కొమ్మనే నరుకుతూంటే చూశాడు. 'ఎంత మూర్ఖుడు? ఇతడు వాసంతికి తగిన వరుడు' అని మనసులో అనుకుని మంత్రి ఆ కుర్రవాడిని తన రాజధానికి తీసికొని వెళ్లాడు. మంత్రి, వరరుచి ఆ ఇద్దరూ ఆ కుర్రవాడిని ప్రతీ ప్రశ్నకు 'ఓం స్వస్తి' అని జవాబి

చ్చేలా శిక్షణ ఇచ్చారు. ఆ అబ్బాయికి రాజు వేషం వేసి రాజకుమారునిలా తయారుచేసి, దర్బారుకి తీసికొని వెళ్లారు. కుర్రవాడు చూడడానికి చాలా అందంగా ఉన్నాడు. మంత్రి ఆ బాలుడు మహావిద్వాంసుడని వాసంతిని నమ్మించేలా అబద్ధమాడాడు. వివాహమైపోయింది. పెళ్ళైతూనే వాసంతికి నిజం తెలిసింది. ఆమె చాలా దుఃఖించింది. ఆమె కాళికాదేవి యొక్క అనన్య భక్తురాలు. ఆమె భర్తను దేవియందు భక్తి కలిగి ఉండేలా నేర్పింది. కాని కాళిదాసు భక్తి, ప్రార్థనలు దేవికి సంతృప్తి కలిగించలేదు. చివరికి ఆయన దేవిఎదుట ఆత్మార్పణకు నిర్ణయించు కున్నాడు. దీనితో దేవి మనసు కరిగి, కాళిదాసు నాలుక మీద కొన్ని అక్షరాలు వ్రాసింది. తర్వాత ఆయన ఒక గొప్ప విద్వాంసుడయ్యాడు.కాళికాదేవి ఆయ నను ఆశీర్వదించింది, కాబట్టి ఆయన 'కాళి దాసు'గా పిలువ బడ్డాడు.

కాళిదాసు విషయంలో ఇది అత్యధికంగా ప్రచారంలో ఉన్న ఒక కథ. ఇంకా అనేక కథలు ఉన్నా వాని విషయంలో నిజమైన ప్రమాణాలు, ఆధారాలు ఏమీ లేవు.

కాళిదాసు విక్రమాదిత్య మహారాజు ఆస్థానంలో వున్నాడు. ఆ రాజు యొక్క కాలం, ప్రాంతం ఇప్పటికీ నిశ్చయంగా తెలీదు. కాని ఆయన పదునాలుగవ శతాబ్దం ముందు కాని (1400 సంవత్సరాలు ముందు కాని) లేదా 6వ శతాబ్దంలో కాని ఉండవచ్చునని భావిస్తున్నారు.

ఉజ్జయిని పట్ల వారికి అధిక సంబంధం ఉండేది. ఆయన సాహిత్యంలో ఉజ్జయిని వర్ణనలు మనకు కనిపిస్తాయి. అందుచే మనం ఆయన ఉజ్జయినిలో ఉండే వాడని చెప్పగలుగుతున్నాము.

కాళిదాసుకు భారతదేశమంతా పరిచయం ఉన్నట్లు కనిపిస్తుంది. 'మేఘదూత' కావ్యంలో ఆయన మధ్య భారతదేశంలోని 'రామగిరి' నుండి హిమాలయాలలోని 'అలకానగరం' వరకూ- ఈ మధ్యలో వచ్చే పర్వతాలు, నదులు, నగరాలు, గ్రామాల యొక్క సుందరమైన వర్ణన చేశాడు. తన రెండవ కావ్యం 'రఘువంశం'లో కాళిదాసు ఉత్తరార్థ క్షేత్రంలోని అస్సాం, బెంగాల్, ఉత్కళ్, దక్షిణ దేశంలోని కేరళ, పాండ్యలు, ఉత్తర దేశంలోని సింధు,

గాంధార మొదలైన ప్రాంతాల ప్రజలను వర్ణించాడాయన. అక్కడి పర్వతాలు, నదులు, ప్రజల జీవన విధానము, ఆహార వ్యవహారాలు, వృత్తులు, వ్యాపారాలు, పరిశ్రమలు మొదలైన వానిని సూక్ష్మంగా చిత్రించాడు.

ఇంతటి సుందర వర్ణన చదివాక మనం, కాళిదాసుకి ఆ ప్రాంతం చాల బాగా పరిచయం ఉందని చెప్పగలము. బహుశా ఆ ప్రాంతంలో తిరిగి వుండవచ్చు. అక్కడి ప్రజల గురించి తెల్సుకుని వుండవచ్చు. వారి రీతి రివాజులు, ప్రవర్తన తెల్సి వుండవచ్చును.

కాళిదాసు నిస్సందేహంగా గొప్ప పండితుడు. అందు వలనే ఆయన అసాధారణ కవి, గొప్పకవి అయ్యాడు. ఆయన రచనలు ఆయన కావ్యాత్మక బుద్ధితో పాటు ఆయన పాండిత్యాన్ని కూడా చూపుతాయి.

ఆయన రచనలు జీవితపు మంచి పనులు, జీవిత లక్ష్యాలను ప్రతిబింబిస్తాయి. రాజమహ లులోని సుఖమయ జీవనం, ఆశ్రమములోని సాదాసీదా సామాన్య జీవనం, గంభీరము, శాంత జీవనము- ఈ రెండింటినీ ఒకే దృష్టితో

వర్ణించేవాడు. భార్యాభర్తల వైవాహిక జీవితంలో ఆనందం, విరహ వేదనలు, వర్ణనలు అంతే నేర్పుతో చేశాడు. గాంభీర్యాన్ని, వినోదాన్ని సరళంగా చిత్రించేవాడు. ఆయన రచనలు వర్ణనలు లేకుండా ఉండవు. కళాత్మకంగా వుండి, అద్వితీయమైన శబ్దాల కూర్పుతో కూడిన సుందర వర్ణన.

కాళిదాసు రచనలు ఏడు, కుమార సంభవం, రఘువంశం, ఈ రెండూ మహా కావ్యాలు. మాళవికాగ్ని మిత్రం, అభిజ్ఞాన శాకుంతలం, విక్రమోర్వశీయం ఆయన రచించిన నాటకాలు. మేఘదూతం, ఋతు సంహారం అందమైన గొప్ప ఖండకావ్యాలు.

## కుమార సంభవం

'కుమార సంభవం' కాళిదాసు గొప్ప రచనల్లో ఒకటి. తన ఆలోచనా భావాలతో కాళిదాసు మొదటి ఏడు సర్గలు రచించాడు. ఈ కావ్యంలో శివపార్వతుల వివాహ వర్ణన వుంది.

హిమాలయ పర్వతాల అందమైన వర్ణనలో ఈ కావ్యం ప్రారంభమౌతుంది. 'హిమాలయ పర్వతాలపై వివిధ రకాల

జీవనాలున్నాయి. ఇక్కడ సిద్ధపురుషులు నివసిస్తున్నారు. కిన్నరులు, అందమైన విద్యాధరులు కూడ నివసిస్తున్నారు. గుహల ముంగిట ఊగుతున్న మేఘాలు, పరదాలలా ఉన్నాయి. ఏనుగు తలల నుండి వెలువడిన మణుల కాంతి సింహాలకు దారి చూపిస్తోంది రక్తపు బిందువులతో కాదు. హిమాలయ పర్వతాలపై పెరిగే 'సరళవృక్షం' యొక్క పాలు ఏనుగులకు చాల ఇష్టం. అవి వాని పృష్ట భాగాల్ని (వీపుని) దీనికి రాసుకుంటాయి. ఈ చెట్టు ద్వారా ఏనుగు యొక్క గుంపు ఏ దిక్కుకు వెళ్ళిందో తెలుస్తుంది. యజ్ఞమునకు కావలసిన సరంజామా అంతా ఇక్కడ దొరుకు తుంది. బ్రహ్మ స్వయంగా ఈ పర్వత మును సృష్టించాడు. ఇది ప్రేమికులకు సౌఖ్యానిచ్చే స్థానమే కాదు, తపస్సు చేసుకునే వారికి కూడా ఆదర్శ స్థానము.

పార్వతి పర్వతరాజు హిమవంతుని పుత్రిక. ఆమె అద్వితీయ సౌందర్యవతిగా పెరిగి పెద్దదవసాగింది. సాధారణంగా స్త్రీలు అందాన్ని ఇనుమడింప చేసుకోవటాన్కి ఆభరణాలు ధరిస్తారు. కాని పార్వతి మెడహారముల [illegible]

కన్పిస్తోందా అన్నట్లు వుంటుంది. ఆమె కంఠం వీణానాదం వలె మృదుమధురంగా వుంటుంది. ఆమె కాంతి బంగారపు కాంతిని గుర్తు తెస్తోంది.

మన పురాణాలలో నారదుడు ఒక ముని. ఆయన శ్రీ పరమేశ్వరుని స్తుతిస్తూ తిరిగే గాయకుడు. ఆయన ఒకనాడు పర్వతరాజు హిమాలయుని దర్బారుకి వచ్చాడు. పార్వతి వివాహం శివునితో జరుగుతుందని జోస్యం చెప్తాడు . శివుడు పార్వతిని స్వీకరిస్తాడా?, లేదా? అనే విషయం పర్వత రాజుకి సందేహం. పర్వతరాజు స్వయంగా శివుణ్ణి అడగలేదు. శివుడు హిమాలయాల్లో ఎత్తైన శిఖరం మీద తపస్సులో మునిగి ఉన్నాడు. పర్వతరాజు తన కుమార్తె పార్వతిని శివుని సేవకొరకు పంపిం చాడు. పార్వతి ఆయనకు పవిత్ర సేవాభావంతో శ్రద్ధగా సేవ చేసింది. ఆమె ప్రతీ రోజూ ఆ తపస్సు చేసే ప్రాంతమంతా శుభ్రం చేసేది. తపస్సుకు అవసరమైన మంచినీరు, పాలు, పండ్లు మొదలైనవి సమకూర్చేది.

శివుడు, ఈవిధంగా తపస్సులో లీనమై వుండగా

'తారకాసురుడు' అను పేరుగల రాక్షసుడు దేవతలను బాధించడం మొదలు పెట్టాడు. దేవతలు దుఃఖించి, బ్రహ్మ దగ్గరకు వెళ్ళారు. బ్రహ్మ సృష్టికర్త, విశ్వకర్త. దేవతలు ఆయన సహాయాన్ని కోరారు. పార్వతి వివాహం భగవంతుడైన శివునితో జరగాలి. ఎందుకంటే వారికి జన్మించిన కుమారుడే తారకాసురుని వధించడానికి సమర్థుడు' అని బ్రహ్మ వారికి చెప్తాడు.

అయితే శివుణ్ణి ఎట్లా మేల్కొల్పాలి అని ప్రశ్న వచ్చింది. పార్వతి వివాహంలో ఎట్లా ఆయన్ని రాజీ పడేలా చేయాలి? అని ప్రశ్న వచ్చింది.

దేవతల రాజు దేవేంద్రుడు. ఆయన సభలో 'కామ' అనే ఒక దేవత వున్నాడు. అతని భార్య రతి. ఆమె అద్వితీయ సౌందర్యవతి. ఎవరి మనస్సులోనైనా పెళ్ళి చేసుకోవాలన్న కోరిక కలిగింపచేసే శక్తి 'కామ' దేవునిలో వుంది. దేవేంద్రుడు ఆయనను (కామదేవుని) శివుని మనస్సులో వివాహేచ్ఛ మేల్కొల్పడానికి పంపించాడు. కామదేవుడు, రతి, వసంతుడు తమ పనుల మీద వెళ్ళారు.

అది వసంత ఋతు సమయం కాదు. కాని కామ దేవుడు వసంతకాలపు శోభను, వైభవాన్ని కల్పించాడు. దక్షిణాన మందమారుత పవనాలు వీచసాగాయి. అనేక చెట్లు పుష్పించాయి. పక్షులు, తుమ్మెదలు, తేనె టీగలు తాజా పూలమీది పుప్పొడిని ఆస్వాదించసాగాయి.

కాని ఇవన్నీ శివుని తపస్సు భంగం చెయ్యడంలో విఫల మయ్యాయి. కామదేవుడు శివుని దగ్గరకు వెళ్ళాడు. శివుడు దేవదారు చెట్టుక్రింద పులిచర్మం మీద కూర్చుని తపస్సులో లీనమై వున్నాడు. శివుని భవ్యత, దివ్యత్వాలు చూచి కామ దేవుడు స్తంభించిపోయాడు. అతని చేతిలోని కామ బాణాలు క్రిందపడ్డాయి. అదే సమయంలో పార్వతి తన నిత్యసేవ చేయడానికి వచ్చింది. ఆమె సూర్య కాంతి లాంటి ఎర్రని చీర ధరించింది. ఆమె జడ ముడిలో పూలదండ వుంది. వజ్రాలదండ ఆమె శిరస్సు మీద మెరుస్తోంది. సుకుమారమైన లతలా ఆమె అడుగులు వేస్తోంది.

ఈ అద్భుత సౌందర్యాన్ని చూచి కామదేవుడు కూడా పొంగిపోయాడు. పార్వతి శివునికి తామర పూలహారాన్ని

సమర్పించే సమయంలోనే, ఒక్కసారిగా శివుడు తపస్సు విడిచి లేచాడు. కామదేవుడు ఈ క్షణం కోసమే ఎదురు చూస్తున్నాడు. ఆయన కామ బాణాన్ని (కామ కైతువును) వేశాడు. శివుడు పార్వతిని చూడడం తోటే తనకు తపోభంగ మైందనుకున్నాడు. అయితే ఇదంతా ఎట్లా జరిగింది? కామదేవుడు తన మదన బాణాలను సంధించడానికి తత్పరుడై వున్నాడు.

అపుడే శివుడు కోపించి, తన మూడవకన్ను తెరిచాడు. భయంకరమైన అగ్ని ప్రజ్వలించసాగింది. కామదేవుడు భస్మం కాగానే, శివుడు అదృశ్యమయ్యాడు. తన భర్త నాశనాన్ని చూచి రతీదేవి తెలివితప్పి పడిపోయింది. పార్వతి తండ్రి పర్వతరాజు దుఃఖించి ఆమెను తన ఇంటికి తీసికొని వెళ్ళాడు.

స్పృహ వచ్చాక, ఆత్మహత్య చేసుకోవాలని రతీదేవి నిర్ణయించుకుంది. అపుడు ఆకాశవాణి శివ పార్వతుల వివాహం తర్వాత కామదేవుడు పునర్జీవితుడౌతాడు అని పలుకుతుంది.

ఈ సమయంలో పార్వతి ఘోరమైన తపస్సు ప్రారంభించింది.

ఆమె స్వయంగా తనచుట్టూ అగ్నిని ప్రజ్వాలింప చేసుకుని, సూర్యుని చూస్తూ నిలబడింది. తీవ్రమైన వర్షం, వణికించే చలి, వేడి గాలులు ఆమెను చలింపజేయలేక పోయాయి. ఆమెను పరీక్షించడానికి శివుడు ఒక బ్రహ్మచారి వేషంలో వచ్చి, శివుని గురించి అసభ్యంగా మాట్లాడ సాగాడు. మెడలో పాము అలంకారంగా వున్న ఆయనను నీవెందుకు కోరుకుంటున్నావు? నువ్వు ఠీవిగా పట్టువస్త్రాలు ధరించావు. నీవు ఆ ఏనుగు చర్మధారిని ఎందుకు సేవించాలను కుంటున్నావు? నువ్వు అతనితో కూడ ఆ ముసలి ఎద్దుమీద తిరుగుతూంటే జనం నవ్వరా? వీటన్నిటికి తోడు ఆయనకు మూడు కన్నులు కూడాను. నీవు ఇట్లాంటి భర్తను ఎందుకు కోరుకుంటున్నావు? అంటూ శివుని గురించి అసభ్యంగా మాట్లాడసాగాడు.

బ్రహ్మచారి వేషంలో వున్న శివుని గుర్తించని కారణంగా పార్వతికి ఈ మాటలు వినగానే కోపం వచ్చింది.



శివుడు తన అసలు రూపంతో పార్వతి ముందు
ప్రత్యక్షం అయ్యాడు

ఆమె ఈ బ్రహ్మచారిని బయటికి గెంటమని దాసీలతో చెప్పింది. అక్కడి నుండి వెళ్లిపోసాగింది. అపుడు శివుడు తన నిజస్వ రూపం చూపించాడు. ఆయున పవిత్ర రూపం చూడగానే పార్వతి ఆశ్చర్యపోయింది. స్తంభంలా అచేతనంగా నిలబడిపోయింది. ఈదృశ్యాన్ని కవి అత్యంత సుందరంగా వర్ణించాడు.

తన తండ్రితో పెండ్లిని గూర్చి మాట్లాడమని తన చెలికత్తె ద్వారా శివునికి రాయబారం పంపింది పార్వతి శివుడు సప్తర్షులద్వారా పర్వతరాజు హిమవంతునికి సందేశం పంపాడు. పర్వతరాజు ఆనందంగా అంగీకరించాడు. పెళ్ళి చాలా వైభవంగా జరిగిపోయింది.

కాళిదాసు యొక్క ఈ 'కుమార సంభవం' కావ్యం రచన పెళ్ళి తర్వాత పూర్తవుతుంది. తిరిగి శివపార్వతులకు పుత్రజననం, అతని ద్వారా దేవతాగణం నాయకత్వంలో తారకాసుర వధ, మొదలైనవి మరొక కవి వ్రాశాడు.

కాళిదాసు రచనలు మూడు విషయాల్లో ప్రసిద్ధి పొందాయి. వానిలో సౌందర్యానుభూతి, కళాత్మకత,

అట్లాగే మన ప్రాచీన పరంపర విశేషాలను అందమైన రీతిలో కని ప్రస్తుతిం చాడు. హిమాలయ పర్వత చిత్రణ, వసంత ఋతు ఆగమనం యొక్క వర్ణన మాటలలో వర్ణించ లేనంత అందంగా వుంటుంది. కళ్ళెదుట జీవించినట్లుగా, కంటికి కట్టినట్లుగా, ప్రత్యక్షంగా చూస్తున్నట్లుగా అనుభవం కలిగేలా ఆయన వర్ణనలు ఎంతో సజీవంగా వుంటాయి.

పార్వతి సౌందర్య వర్ణన ఆయన కవిత్వ భావనకు వెలుగునిచ్చింది. కామదేవుడు భస్మ మైన తర్వాత, రతీ విలాపం, మన కళ్ళ నుండి నీరు తెప్పిస్తుంది. శివపార్వతుల వైవాహిక జీవన విశేషాలు, ఆనందం లేదా దుఃఖ భావనలు కూడా ఆయన మిక్కిలి ప్రభావవంతంగా చిత్రించాడు.

కాళిదాసు యొక్క రచనలు మన సంస్కృతి యొక్క అందమైన శబ్దచిత్రములు. 'ఈ సంస్కృతి ఏమిటి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. సంస్కృతి అంటే బయట మన మనసు, బయటి వ్యవహారాల విషయంలో మన ప్రవర్తనా విధానము. పులి యొక్క రంగు, సుగంధ మనస్సుకు మోహం కలిగించినట్లుగా, అదేవిధంగా మన మంచి ప్రవర్తన

ప్రభావం వుంటుంది. మన చుట్టుప్రక్కల వాతావరణాన్ని చూసి మనం ఆనందిస్తాం. పరిపూర్ణ మానవునియొక్క ఆలోచనలు, వాక్కు, పనులు ఇతరులకు ఆనందాన్నిస్తాయి. వీటన్నిటినీ కాళిదాసు చాలా సమర్థవంతంగా వర్ణించాడు. దీనికి తోడు కాళిదాసు పనులు, వ్యవహారాలను కూడా అందంగా వర్ణించాడు. శివుని వద్ద పార్వతి వివాహ కారణం తెలియకనే పర్వత రాజు పార్వతిని శివుని సేవకు పంపడం, శివునితో పార్వతి వివాహం గురించి సప్తర్షులను రాయబారం పంపడం - ఈ విషయమంతా కాళిదాసు యొక్క ఉన్నతమైన అభిరుచిని లేదా ఆదరణను పెంపొందించడానికి తోడ్పడ్డాయి. పార్వతి ఏకాగ్రచిత్తంతో సేవ చేయటం, శివునికి గూర్చిన అసభ్య పదజాలమును సహించలేకపోవడం ఈ విషయాలన్నీ పార్వతి, పెరిగిన ఉన్నత సంస్కృతిని చూపుతున్నాయి. పార్వతి సౌందర్యాన్ని చూచి శివుడు కొంచెం విచలితుడైనాడు. కాని కామ దేవుని కపటం తెల్సి అతనిని భస్మంచేశాడు. ఇవన్నీ పార్వతిని పరీక్షిస్తున్నాయి. సప్తర్షులను రాజు వద్దకు పంపడం శివుని మనస్సు

గొప్పతనాన్ని లేదా పరిపక్వతను చూపుతోంది. ఇట్లా చూస్తే శివుడు పార్వతి బాహ్య సౌందర్యము వలన ప్రభావితుడు కాలేదు. ఆమె ఉన్నత గుణములు, తపస్సు చూచి మోహితుడయ్యాడు. శివ పార్వతులు తపస్సు చేసి ఒక త్యాగమయ జీవితం గడుపుతున్నారు. ఇద్దరూ పవిత్రత మూర్తీభవించిన రూపాలు. వారి కుమారుడు 'కుమార్' తల్లిదండ్రుల తపస్సు కుమారునికి శక్తి నిచ్చింది. దీనితో అతడు తారకాసురుడనే రాక్షసుని వధించాడు.

మనపూర్వులు మనకు ఉత్తమమైన, ఆదర్శ పూర్ణమైన జీవనం గడపడానికి ఏ మార్గం చెప్పారో దానిని కాళిదాసు కావ్యం మనకు స్పష్ట సుందర చిత్రంనిస్తుంది.

## రఘువంశం

కాళిదాసు ద్వితీయ సుందరకావ్యం రఘు వంశం. దీనిలో పందొమ్మిది అధ్యాయాలున్నాయి. వీనినే సర్గ అంటారు. ఈ మహాకావ్యంలో దిలీప మహారాజు, శ్రీరాముడు, లవకుశుల యొక్క కథ వుంది. చాలా సంక్షిప్తంగా నీటి నుండి అగ్ని వర్ణని దాకా ఇరువది యొక్క

రాజుల వర్ణన కూడా వుంది. ప్రారంభంలో కవి కాళిదాసు రఘు మహారాజు యొక్క వంశమును ప్రశంసిస్తాడు.

రాజవంశం మంచి కులము, శ్రేష్టమైనది దానికి సంబంధించిన వ్యక్తులందరూ తమ (విద్యాభ్యాసం) ఉత్తమగురువుల వద్ద విద్య నేర్చేవారు. తగిన సమయంలో వివాహ మాడేవారు. న్యాయంగాను, ధర్మంగాను రాజ్యం చేసే వారు. వార్ధక్యంరాగానే తమ రాజ్యాధికార వారసత్వాన్ని వారసునికప్పగించి సన్యసించేవారు. యోగంద్వారా శరీరాన్ని విడిచేవారు. అవసర మైన వారికి సహాయం చేయడానికి వారు ధనం సంపాదించేవారు. కీర్తిని పొందడానికి యుద్ధాలు చేసే వారు. నేరం చేసిన వారికి (అపరాధులకు) శిక్ష లభించేది. రాజు, ప్రజలు మిక్కిలి ఆలోచన తోను, నిర్భయంగాను రాజ్యంచేసి, తమ అభీష్టం నెరవేర్చుకునేవారు. వారి సామ్రాజ్యం సముద్రాల దాక వ్యాపించింది. వారు తమ రథాన్ని స్వర్గం దాక తీసికొని వెళ్ళగలిగే వారు. కవి కాళిదాసు యొక్క ప్రధానోద్దేశ్యం రఘువంశ రాజుల గుణగణాలను వర్ణించడం. దిలీప మహారాజుతో కథ ప్రారంభమౌతుంది.

దిలీప మహారాజు ఉత్తమ వంశస్థుడు. ఆయన ఎత్తు, పొడవు కలిగి, వెడల్పైన వక్షస్థల ముతో, ఆకర్షణీయమైన వ్యక్తిత్వం కలిగిన ధన వంతుడైన రాజు. ఆయన క్షత్రియ ధర్మం యొక్క సాకారమూర్తి. ఆయన వ్యక్తిత్వం లాగానే ఆయన బుద్ధి వుండేది. ఆయన తెలివి ఆయన అపారజ్ఞాన సంపదలో సాటిలేనిది. అందుచేత ఆయన పనులలో ఆయనకు ఉన్నతమైన జ్ఞానం లభించేది. అందువలన పరిణామం ఎల్లప్పుడూ ప్రయత్నాలకు అనుగుణంగా వుండేది.

ఆయన భార్య సుదక్షిణాదేవి- ఆదర్శపత్ని. కాని సంతానం లేకపోవటం, పుత్రులు లేక పోవటం వలన వారికి చాలా దుఃఖంగా వుండేది. వారు వశిష్ఠ మహర్షి ఆశ్రమానికి వెళ్ళారు. మహర్షి కామధేనువు పుత్రిక నందినీ ధేనువును సేవించమని చెప్పాడు.

అతడు చెప్పినట్లు దిలీపుడు ఇరువది యొక్క రోజులు అడవిలోకి వెళ్ళి నందినీ ధేనువును సేవించాడు. ఆఖరిరోజు ఒక సింహం నందినీ ధేనువు మీద దాడి చేసింది.

రాజు తన అమ్ములపొదినుండి బాణం తీసి దానిని చంపబోగా, ఆయన చేయి విల్లుకు అతుక్కుపోయింది. మనుష్య భాషలో సింహం మాట్లాడసాగింది.

- ఓ రాజా! ఈ ఆవు నా ఆహారము. అందుచేత నీవు నీ ఆశ్రమానికి తిరిగివెళ్ళు. అపుడు దిలీపమహారాజు స్వయంగా తన శరీరాన్ని సింహానికి ఆహారంగా సమర్పించాడు. ఆశ్చర్యంగా సింహం అంతర్ధానమైంది. వాస్తవంగా సింహం నందినీ ధేనువు ద్వారా రాజును పరీక్షించడానికి చేయబడింది. తన పాలుతాగిన పిమ్మట రాజుకు కుమారుడు జన్మిస్తాడని నందిని ఆశీర్వదించింది రాజును.

ఆశ్రమానికి తిరిగి వచ్చి రాజు, రాణి, నందినీ ధేనువు యొక్క పాలు త్రాగారు. రాజధానికి తిరిగి వచ్చారు. తగిన సమయంలో రాణీ సుదక్షిణా దేవికి ఒక కుమారుడు జన్మించాడు.

అతనికి 'రఘుమహారాజు' అని పేరు పెట్టారు. మహాకవి దిలీపుని రూపంలో సత్య మందాసక్తి, ఉన్నతమైన నైతిక, ధార్మిక ధర్మాలను ఆచరించే ఒక రాజు యొక్క వర్ణన

కనిపిస్తుంది. రాజు, సాధువుల మధ్య గల గాఢ సంబంధం వుంటుంది. పవిత్ర మూర్తులైన సాధువులు తమ ఆశీర్వాదం ద్వారా గొప్ప వ్యక్తులను పుట్టిస్తున్నారు.

కాళిదాస మహాకవి రఘుమహారాజు కథ కూడా మనకు వినిపిస్తాడు. రఘుమహారాజు రాజకుమారుడుగా ఉండగానే, అశ్వమేధం చేయడానికి తండ్రి పంపిన అశ్వమును శౌర్య సాహసాలతో, సాహస పరాక్రమాలతో రక్షిస్తాడు. దేవతల రాజైన ఇంద్రుడికి, రఘుకి మధ్య భయం కర యుద్ధం జరుగుతుంది. అపుడు దిలీప మహారాజు నూరవ అశ్వమేధ యాగం చేస్తున్నాడు. రఘుమహారాజు పరాక్రమానికి ముగ్ధుడై ఇంద్రుడు దిలీప మహారాజును ఆశీర్వదిస్తాడు. అనంతరం దిలీపుడు రాజ్యభారాన్ని కుమారునకు అప్పగించి, వానప్రస్థాశ్రమానికి వెళ్ళి పోయాడు. అక్కడ ఆయన తన శేషజీవితాన్ని తపస్సులో గడిపాడు.

రఘువు అనేక రాజ్యాలు జయించి, తన రాజ్యాన్ని పెంచాడు. ఆయన 'విశ్వజిత్' అను పేరుగల గొప్ప యజ్ఞం చేశాడు. దాని తర్వాత తన ధనసంపదనంతా దానం

చేసేశాడు. అదే సమయంలో 'కౌత్సుడు' అనే ఋషి కుమారుడు వచ్చాడు. అతడు గురుదక్షిణగా రాజునుండి సహాయం కోరాడు. రాజు అప్పటికే తన ధనం యావత్తూ దానాలు చేసేశాడు. రాజు మట్టి పాత్రలో మంచి నీరు మాత్రం ఇవ్వగలడు.

ఋషి కుమారుని అవసరం తెలిసి, రాజు కుబేరునిపైకి దండెత్తడానికి నిశ్చయించాడు. స్వయంగా కుబేరుడు వెంటనే బయలుదేరి వచ్చాడు. రఘువు ఖజానాను ధనంతో నింపాడు. అపుడు రఘువు ఋషి కుమారుడు కౌత్సుని కోరిక తీర్చాడు.

రఘువు కుమారుడు 'అజుడు' అతడు మిక్కిలి సుందరుడు, దయార్ద్ర హృదయుడు. పెద్దయాక అతడు విదర్భ రాజ్యములో ఇందుమతి స్వయంవరానికి వెళ్ళాడు. ఇందుమతి స్వయం వర మండపంలోనికి ప్రవేశించగానే, ఆమె దాసి సునంద అక్కడ కూర్చుని వున్న రాజకుమారుల సౌందర్యం, పరాక్రమం, వీరత్వము గూర్చి పరిచయం చేసింది. సునంద అజయ రాజకుమారుని కూడ పరిచయం



కౌత్సునికి మట్టిపాత్రలో పవిత్ర తీర్థాన్ని
ఇస్తున్న రఘుమహారాజు

చేసింది. రాజ కుమారికి అతని అందమైన గుణాలు గూర్చి పరివారం గూర్చి పొగిడింది. ఇందుమతి వరమాలను అతని మెడలో వేసింది.

ఈ స్వయంవరాన్ని కాళిదాసు చాలా అందంగా వర్ణించాడు. రాజకుమారుని వర్ణన కూడా అందంగానే వుంది. అతని శారీరక సౌందర్యం, పరాక్రమము, ఐశ్వర్యం (సంపద) మొదలైనవి మనసుకు హత్తుకునేలా రచించాడు. ఏ రాజకుమారునీ కూడా ఒకరి కంటే ఒకరు తక్కువగా ఏ విషయంలోనూ చెప్పలేదు. ఇందు మతి ఈ కారణాల (దోషాలు) వలన వారిని అంగీకరించలేదు అని కూడా చెప్పలేదు. అట్లాగే ప్రతి వ్యక్తి యొక్క వ్యక్తిత్వం భిన్నంగా వుంటుంది. మనం ఒకరితో ఒకరు ప్రేమలో ఎందుకు పడ్డాం (ఒకరినొకరు ఎందుకు అభిమానించు కుంటున్నాం) అనే కారణం ఏమీ కనబడదు అని కవి అనుకుంటాడు. ఈ చిత్రం కవియొక్క ఉన్నతా భిరుచిని, సౌందర్య దృష్టిని, ఉల్లాసవంతమైన ఉత్తమ మానసిక ప్రవృత్తిని తెలుపుతుంది.

ఇందుమతి, అజయుల వివాహం చాలా వైభవంగా జరిగింది. కాని నిరాశ చెందిన రాజకుమారులు అజునిపై బదులు తీర్చుకోవ డానికి దాడి చేశారు. భయంకరమైన యుద్ధం జరిగింది. అజుడు అందరినీ ఓడించి, తాను విజయం పొంది, తన నూతన వధువుతో రాజధానికి తిరిగి వచ్చాడు. రఘుమహారాజు పుత్రుని పరాక్రమము చూచి, రాజ్య భారం అతనికి అప్పగించి, అయోధ్య వెలుపలి ప్రాంతంలో ఆశ్రమంలో నివసించసాగాడు.

తండ్రి వైరాగ్యపు మెట్లు ఎక్కుతూంటే (అంటే తండ్రి యోగిలా మారితే), కుమారుడు రాజ సింహాసనంపై కూర్చున్నాడు. ఈ ఇద్దరి వ్యవహారం లీనమైన విధానాన్నీ, తెలివైన వర్ణనలను కవి చేశాడు. తండ్రికి ఋషులు, మునులు మార్గదర్శనం చేస్తున్నారు. కొడుక్కి మంత్రులు సహాయం చేస్తున్నారు. తండ్రి సాంసారిక సుఖా లన్నిటి మీద విజయం సాధించాడు. కుమారుడు బయటి శత్రువులను పరాజితుల్ని చేశాడు. (ఒకరు అంతర్గత సుఖాలపై విజయంసాధిస్తే మరొకరు బహిర్గత శత్రువులను

జయించారు) ఏకాగ్రదృష్టితో ఈశ్వరుని ధ్యానిస్తే జీవితంలో శాంతి లభి స్తుంది - సంతోషం లభిస్తుంది అని రఘుమహారాజు చరిత్ర మనకు చూపుతోంది. పవిత్ర నడవడిక ద్వారా ఏ మానవుడైనా నిజమైన ఆనందం, సంతోషం పొందుతాడు- అనే విషయం అజమహారాజు జీవితం ద్వారా ఋజువౌతోంది.

దిలీపమహారాజు, రఘుమహారాజు ఇద్దరూ గొప్ప వ్యక్తులైనప్పటికీ మనం వారిలో తేడాని అనుభవంలో తెల్సుకుంటాం. ప్రసిద్ధి చెందిన మన పూర్వుల ద్వారా మానవుల కొరకు నాలుగు లక్ష్యాలు నిర్దేశించబడ్డాయి. అవి ధర్మము, అర్థము, కామము, మరియు మోక్షము. ధనం సంపాదించాలనే కోరిక, లేదా సుఖంపొందాలనే అభిలాష - ఈ రెండింటిలో తప్పులేదు. కాని ఈ రెండింటి విషయంలో తగిన విధంగా ప్రవర్తించటం అవసరం. ధనమును నీతిగా, నిజాయితీగా సంపాదించాలి. ఇతరులను అన్యాయం చేయకుండా డబ్బు సంపాదించాలి. సంపాదించిన ధనమును మంచిగా, యోగ్యమైన పనులకు ఖర్చు పెట్టాలి.

ఇతరులకు హితముకాని, చెడును కలిగించడానికి ఈ ధన మును ఉపయోగించవద్దు. పాపముల నుండి విముక్తి పొంది, మృత్యువు యొక్క దైవత్వమును పొందడానికి అనువైన విధంగా మానవుడు జీవించాలి. దిలీపుని జీవితంలో ధర్మం పరిపాలించిందని మనం చూశాం. నందినీ ధేనువును రక్షించే నెపంతో సింహానికి ఆహారం కావడానికి ఆయన అంగీకరించడం, ఆయన యొక్క త్యాగానికి నిదర్శనం. ధనం సంపాదించడం, ఖర్చుపెట్టడం అనే సరియైన విధానాలు మనం రఘుమహారాజు జీవితం చూస్తే తెలుస్తుంది. అనేక రాజ్యాలు జయించి, సంపాదించిన ధనాన్ని, ఆయన అవసరమైన వారికి పంచాడు, చివరకు ఆయన దగ్గర కేవలం ఒక మట్టిపాత్ర మిగిలింది.

అజ మహారాజుకి ప్రజల యొక్క స్నేహం, ప్రేమ లభించాయి. ఒకనాడాయన సతీసమే తంగా ఉద్యానవనంలో విహరిస్తూంటే, నారదమహాముని ఆకాశమార్గాన వెళుతున్నాడు. నారదముని వీణ యొక్క దండ తొలిగి, ఇందుమతి శిరస్సుపై పడింది. ఆమె స్పృహ తప్పి పడి

మరణించింది. అజునికి తీవ్రమైన దుఃఖం కలిగింది. ఆయన తెలివితప్పి పడిపోయాడు. మంత్రులు ఆయనకు తెలివి తెప్పించారు. అప్పుడు ఇందుమతి శరీరాన్ని ఒడిలోకి తీసుకొని ఆయన విలపించటం మొదలుపెట్టాడు. 'ఒక పువ్వు నీ జీవితాన్ని తీసుకెళ్ళిపోయింది. నేను ఈ దండను చేత్తో పట్టుకున్నాను, అయినా నేనెందుకు చావటం లేదు? ఇది పరమేశ్వరుని కోరిక. విషం అమృతంలా మారుతుంది. అమృతం విషంలా మారుతుంది. నీవు నా సర్వస్వానివి. నా భార్యవు, సలహాదారువీ, సహాయకారివి, కళలు నేర్చుకోవటంలో నా శిష్యురాలివి, నిన్ను తీసికొని పోయి మృత్యువు నా సర్వస్వాన్ని దోచుకొని పోయింది' .

అజ మహారాజు కుమారుడు దశరథుడు ఆ సమయంలో చాలా చిన్నవయసు వాడు. అజ మహారాజు ఎనిమిది సంవత్సరాలు ఎట్లాగో సింహాసనం మీదున్నాడు, తర్వాత దశరథునికి రాజ్యం అప్పగించి గంగా - సరయూ నదుల సంగమ ప్రాంతంలో నివసించసాగాడు. అక్కడే ఆయన తనువు చాలించాడు.

కవి- జీవితానికి ఆనందాన్నిచ్చే విషయాన్ని అజ మహారాజు జీవితంద్వారా మనకు చూపిం చాడు. ఇక్కడ మనం ఆయన సుఖజీవనం, విరహ వర్ణనలు చూస్తాము. అజ మహారాజు ఆమె కోసం చాలా దుఃఖించి, నదిలో మునిగి తన జీవితాన్ని చాలిస్తాడు. ఎందుకంటే భార్య మరణంతో విరహవేదన భరించలేకపోయాడు. అంకిత ప్రేమభావానికి ఇది ఒక ఉత్తమ ఉదాహరణ.

మొదటి ఎనిమిది సర్గలలో దిలీపమహారాజు, రఘు, అజమహారాజుల కథలున్నాయి. దీని తర్వాత అధ్యాయం దశరథుడు , శ్రీరాముడు, లవకుశుల విషయాలున్నాయి. కవి సంక్షిప్తంగా రామాయణ ప్రసంగాన్ని మనకి చెప్తాడు. ఆ విధంగా రామాయణ కథ ప్రసిద్ధి పొందింది. కాని కాళిదాసు యొక్క వర్ణనాశైలి అత్యద్భుతంగా సాగింది. వాల్మీకి రామాయణం నిజమైన, సులభ మైన, సుందరమైన, అసలు సిసలు వజ్రంలా మెరుపుగలదీ కాళిదాసు వజ్రంలా మెరిసే ఈ విషయాన్ని తన శైలి ద్వారా, తనదైన రీతిలో ఎక్కువ ప్రకాశవంతం చేశాడు.

'కుశుని తర్వాత అతని పుత్రుడు 'అతిధి' సింహాసనాన్ని అధిష్టించాడు. అతిధి ధర్మాను సారంగా రాజ్యం చేశాడు. రాజ్యాన్ని శత్రువుల నుండి రక్షించాడు.

సాధువులు నిర్భయంగా తపస్సు చేసుకో సాగారు.

కాళిదాసు రఘువంశంలో ఇరువది యొక్క రాజుల పట్టికనిచ్చాడు. వారు .'అతిధి తర్వాత రాజ్యానికి వచ్చిన వారు. కవి చెప్పిన ప్రకారం, ఈ వంశంలో చివరిరాజు అగ్ని వర్ణుడు విలాసవంతుడు, ఆయన రాజుగా తన కర్తవ్యాన్ని నిర్వహించ లేదు. ప్రజలు రాజుగారి దర్శనం కోసం వస్తే, ఆయన్న కిటికీ దగ్గర కాళ్ళుజాపుకొని కూర్చునేవాడని చెప్పబడింది. రోగాలతో బాధపడే ఆయన మంచం ఎక్కాడు. ఆయన మరణించాక ఆయన భార్య (మహారాణి) పండితులైన మంత్రివర్యుల సహాయంతో రాజ్యాన్ని నడిపించింది. ఈ విధంగా రఘు వంశము యొక్క వర్ణనలు, ఇటువంటి దుఃఖపూరితమైన సంఘట నలతో పూర్తవుతుంది.

'రఘువంశం' మన ప్రాచీన పౌరాణిక సంస్కృతి, రీతి రివాజులను (ఆచార వ్యవహా రాలు) ప్రతిబింబించే గ్రంథం. మన పూర్వులలో మంచిరాజులు ఎవరు? ఎవరు తపస్సు చేశారు? మానవులు ఎటువంటి ఆదర్శవంతమైన జీవితం గడపాలి- మొదలైనవానిని గురించి వివరంగా చర్చించ బడింది. కవి పరస్పర విరుద్ధమైన చరిత్రలు- వశిష్టుడు, దిలీపుడు, రఘు, అజుడు - మొదలైనవి చిత్రించాడు. దురాచార సంపన్నుడుగా 'అగ్నివర్ణుని' మనకు ప్రతిబిం బింప చేస్తాడు.

## అత్యుత్తమ రచన - ''శాకుంతలం''

కాళిదాసు మొదటి నాటకం మాళవికాగ్ని మిత్రం. ఈ నాటకమును జనులు అంగీకరిస్తారా లేదా అనేది ఆయన నిశ్చయించుకో లేకపో యాడు. ఆయన తన విషయాన్ని ప్రదర్శించాడు. 'పురాణ వస్తువులన్నీ మంచివి కావు. కొత్త వస్తువులు చెడ్డవి కావు. చంచలమైన వస్తువులు పూర్వకాలం లో ఎక్కువ ఉపయోగించకపోవచ్చు, కొత్తవి మంచివి కాక

పోవచ్చును. మాళవిక, అగ్నిమిత్రుల ప్రేమకథ ఈ విషయం.

కాళిదాసు రెండవ నాటకం విక్రమోర్వ శీయం. ఇది పురూరవ మహారాజు, స్వర్గంలోని అప్సరస ఊర్వశి యొక్క ప్రేమా - విరహం - దీనికి సంబంధించిన కథ.

కాళిదాసు రచనల్లో మిక్కిలి ఉత్తమమైనది 'అభిజ్ఞాన శాకుంతలం'. ఈ అత్యుత్తమ రచన ప్రపంచంలోని అన్ని భాషలలోనికి అనువదించ బడింది. మహాభారతం ఆది పర్వంలో 'శకుంతల' కథ వుంది. దుష్యంతుడు వేటాడుతూ కణ్వాశ్ర మానికి వస్తాడు. ముని ఆశ్రమంలో లేడు. ఆయన అభిమాన పుత్రిక అతిథి యొక్క మంచి చెడ్డలు చూడ సాగింది. ఆమెను చూస్తూనే, ఆమె అందానికి ఆకర్షితుడయ్యాడు దుష్యంతుడు. ఆమెతో వివాహ ప్రస్తావన తెచ్చాడాయన. శకుంతల ఒక షరతు పెట్టింది. తనకు పుట్టబోయే బిడ్డ రాజ్యాధికారి (రాజు) కావాలని, రాజు నుండి మాటతీసుకొంది. రాజు ఈ విషయాన్ని అంగీకరించాడు. వివాహం చేసుకుని కొద్దిదినాలు

సుఖశాంతులతో గడిపాడు. తర్వాత దుష్యంతుడు తన రాజధానికి తిరిగి వెళ్ళాడు. తగిన సమయంలో శకుంతలకు ఒక కుమారుడు జన్మించాడు. అతడికి 'సర్వదమనుడు' అని పేరు పెట్టారు.

ఆరు సంవత్సరాలు గడిచాయి కాని దుష్యంత మహారాజు తన భార్య, పిల్లవానిని పిలిపించలేదు. కణ్వముని శకుంతలను రాజమహలుకు పంపడానికి నిశ్చయించు కున్నాడు. వాళ్లు రాజాస్థానానికి చేరారు. కాని దుష్యంత మహారాజు వారిని గుర్తించలేకపోయాడు. వారిని నిరాకరించాడు. శకుంతల మిక్కిలి దుఃఖించింది - 'ఇతడు నీ కుమారుడు. ఇతడిని స్వీకరించు' అని ఆకాశవాణి దుష్యంతునికి ఆజ్ఞాపించింది. రాజు కుమారుని స్వీకరించాడు. ఈ పిల్లవాడే తర్వాతి కాలంలో 'భరతుడు' అనే పేరుతో ప్రసిద్ధిచెందాడు.

కాళిదాసు 'మహాభారతంలో' ఈ విషయం మీద మిక్కిలి సుందరమైన నాటకాన్ని వ్రాశాడు. శకుంతల దుష్యంతుల ప్రథమ సమాగమం అత్యంత మధురంగా, సుందరంగా వర్ణించాడు.

వేటాడుతూ దుష్యంతమహారాజు కణ్వమహాముని ఆశ్రమానికి వస్తాడు. తన చెలికత్తెలతో మొక్కలకు నీళ్లు పోస్తున్న శకుంతలను చూస్తాడు. ఆమె సౌందర్యానికి ముగ్ధుడై ఆమెను వివాహమాడాలనుకుంటాడు. శకుంతల కూడా ఈ మహాపురుషుని చూసి ముగ్ధురాలవుతుంది. వారు గాంధర్వపద్ధతిని వివాహం చేసుకుంటారు. శకుంతలను విడిచి రాజు రాజధానికి వెడతాడు. శకుంతల తన కుమారుని యువరాజుని చేయాలన్నమాట చెప్పలేదు. ఎందుకంటే దీనిని ఆయన ఎట్లాగూ అంగీకరిస్తాడు.

దుర్వాస మహాఋషి కణ్వాశ్రమంలో ఆయనను కలవడానికి వస్తాడు. కణ్వుడు ఆశ్రమంలో లేడు. రాజును గూర్చిన ఆలోచనలో మునిగివున్న శకుంతలతో దుర్వాసుడు ఇట్లా అంటాడు - 'అతిథి వచ్చాడు' శకుంతలకు ఈ మాటలు వినపడలేదు. అందుచేత దుర్వాసుడు (కోపిష్టిగా ప్రసిద్ధి చెందినవాడు) మిక్కిలి కోపించి, ఎవరి గూర్చిన ఆలోచనలో నీవుంటివో అతడు నిన్ను మరచిపోవుగాక' అని శాపమిస్తాడు. తర్వాత దయతలచి అంటాడు- 'నీకు అతడిచ్చిన గుర్తు చూడగానే నిన్ను గుర్తిస్తాడు'.

దురదృష్టవశాత్తు దుష్యంతుడిచ్చిన ఉంగరం పోవడం, రాజు వారిని గుర్తించకపోవడం జరుగుతుంది. కణ్వముని గర్భవతియైన శకుంతలను రాజదర్బారుకు తన శిష్యులతో పంపుతాడు. కాళిదాసు కణ్వముని ద్వారా శకుంతలకు వీడ్కోలు ఇవ్వడం మనసుకు హత్తుకునేలా వర్ణించాడు. ఆశ్రమమంతా విచారంలో మునిగిపోతారు. కణ్వుడు, శకుంతల చెలికత్తెలు, ఆమెను వీడ్కొలిపేటప్పుడు కన్నీరు కారుస్తారు. పశుపక్ష్యాదులు, మొక్కలు, చెట్లు కూడా దుఃఖంతో చలించిపోతాయి.

శకుంతల వచ్చాక దుష్యంత మహారాజు ఆమెను గుర్తించడు. రాజు వారి వైపు చూడడానికి కూడా ఇష్టపడడు. ఎందుకంటే ఆమె ఒక పరస్త్రీ. ఆమె తన భార్య అని ఆయన నమ్మడు. మార్గమధ్యంలో ఉంగరం పోవడంతో రాజు నిరాకరించడంతో శకుంతల మిక్కిలి దుఃఖించి తెలివితప్పి పడిపోతుంది. స్పృహ తప్పుతుంది. తర్వాత ఒక దివ్యశక్తి ఆమెను లేవనెత్తి తీసికెళ్ళిపోతుంది.

కొద్దిరోజుల తర్వాత ఒక చేప కడుపులో ఆ ఉంగరం

దొరుకుతుంది. ఉంగరం చూడగానే రాజుకి అన్ని విషయాలు గుర్తుకువస్తాయి. శకుంతలను నిరాకరిం చడంతో ఆయనకు చాలా దుఃఖం కలుగుతుంది. దుష్యంతుడు ఇంద్రుని సందేశంపై ఆయనకు సహాయ పడడానికి స్వర్గలోకానికి వెళతాడు. తిరిగి వచ్చేటప్పుడు మరీచి మహర్షి ఆశ్రమానికి వెడతాడు. అక్కడ ఒక చిన్న బాలుడు, సింహం పిల్ల నోటిని భయంలేకుండా తెరవడం చూస్తాడు. మాటా మంతీ సందర్భంలో ఆ పిల్లవాడు మరెవరో కాదని తన కుమారుడు 'సర్వదమనుడు' అని తెలుస్తుంది. దుష్యంతుడు, అతని భార్య, అతని కుమారుల సుఖ సమాగమం జరుగుతుంది.

నాటకం చివరన మనం శకుంతల దుఃఖం చూసి ద్రవించిపోతాము. దుష్యంతుని దోషిగా భావించాలా? ఈ సంఘటననంతనూ నడిపిం చిన ఆ దివ్యశక్తిని దోషిగా భావించాలో మనకర్థం కాదు. నాటకం చివరి దృశ్యంలో మనం శకుంతలను అత్యంత సాధారణమైన చీరలో చూస్తాం. అప్పుడు కూడా ఆ వైభవం, ఉన్నతమైన

మూర్తిలా వుంటుంది. ఆమె చిన్న వయసుదైనా కూడా, ఆమె మాటలు చాలా అర్థవంతంగాను, గంభీరంగాను వుంటాయి. ఆమె సాక్షాత్తు తపస్విని. ఒక చంచలమైన ముగ్ధరూపం నుండి, ఒక సేవాభావంకల యువతి రూపంలో శకుంతల యొక్క మార్పును చూచి మనం ఆశ్చర్యపోతాం. శకుంతల యొక్క చెలికత్తెలు ఆమెను ప్రేమతో కోపం వచ్చేటట్లు చేయటం, కణ్వుని దూరదృష్టి, రాజు శకుంతలపై విరహంతో దుఃఖించటం, శకుంతల యొక్క నిర్మలమైన స్వచ్ఛమైన ప్రేమ, దివ్యశక్తి ద్వారా తిరిగి కలుసుకోవటం (పునస్సమాగమం)- ఈ విషయాలు మన ఎదుట గొప్ప జీవిత చిత్రాన్ని ప్రదర్శిస్తాయి.

'మేఘదూతం' ఒక అందమైన ప్రేమ కావ్యం. ఒక సంవత్సరం భార్య నుండి దూరంగా వున్న 'యక్షుడు' ఆమెకు ఒక సందేశం పంపుతాడు. ఆ భార్య అలకా నగరంలో వుంటుంది. యక్షుడు మేఘంతో అంటాడు- రమ్మా! నేను ఏమి చెప్పానో, అది ఆమెతో చెప్పు! ఒక మేఘాన్ని సందేశం మోసుకొనిపోయే రూపంలో

ఎన్నుకోవటం ఒక విలక్షణమైన విషయం. మేఘం 'రామగిరి' నుండి అలకానగరి దాకా ప్రయాణదర్శన చాలా అందంగా వుంటుంది. నదులు, పర్వతాలు, కొండలూ, పల్లెలూ - పట్నాలు, పక్షులు, తుమ్మెదలు (తేనెటీగలు), వీటన్నిటిని కవి అందంగా వర్ణించాడు.

ఇది విశ్వం యొక్క సుందరమైన చిత్రీకరణ. అలకానగరిలో యక్షుని ఇల్లు, చుట్టుప్రక్కల గల తోట, వీణ తీగలు మీటుచున్న యక్షుని భార్య యొక్క సౌందర్యము మొదలైన వారి వర్ణన మనోహరంగా వుంది.

'ఋతు సంహారం' ఒక చిన్న కావ్యము. దీనిలో కవి కాళిదాసు ఆరు ఋతువులను వర్ణించాడు. ఇది కూడ ఆకర్షణీయంగా వుంది. కవి ఇక్కడ ప్రతీ విషయంలో సౌందర్యం చూస్తాడు. ప్రత్యేక ఋతువు, విడివిడిగా కవి మనసుకు ఆనందం కలిగిస్తాయి. ఇది మిక్కిలి శరీరం గగుర్పొడిచే దృశ్యం.

కాళిదాసు రచనలు మొత్తం సౌందర్యా నందాన్ని కలిగిస్తాయి. ఆయనతోబాటు మనం ఉన్నత సంస్కృతి,

ఉన్నత వ్యక్తిత్వంతో మెలగుతాము. 'పువ్వు పుట్టగానే పరిమళిస్తుంది' అన్నట్లు ఆయన రచనలు ఆ పూలతో వుంటాయి. మానవుని పరిణతి చెందిన సాహసమునసు, బుద్ధినలువైపుల ప్రజలకు సంతోషాన్నిస్తుంది. కాళిదాసు రచనలతో మనం శరీరము, మనసు రెండు పవిత్రత, తేజస్సు గల మనషులు గల లోకంలో మనం ప్రవేశిస్తాము. మన స్వభావాన్ని ఉన్నతము, నైతిక శయ్య వరకు చేరడానికి నేర్పును మనం గ్రహిస్తాము. పార్వతి, దిలీపుడు, రఘువు, అజుడు, శకుంతల, కణ్వుడు, దుష్యంతుడు- వీరి కలయికతో మనం ప్రసన్నులవుతాము. ఇటువంటి అద్భుతమైన అనుభూతి కోసం మనం, మిగిలిన మానవు లంతా కాళిదాసు రచనలు చదువుతున్నాము.

  

# భారత్ భారతి

(బాల పుస్తకమాల)

| | |
|---|---|
| ఛత్రపతి శివాజీ | 5 - 00 |
| గురుగోవిందసింగ్ | 5 - 00 |
| ఝాన్సీ లక్ష్మీబాయి | 5 - 00 |
| బాలగంగాధర తిలక్ | 5 - 00 |
| వీరసావర్కార్ | 5 - 00 |
| భగత్‌సింగ్ | 5 - 00 |
| అభిమన్యుడు | 5 - 00 |
| సమర్థరామదాసు | 5 - 00 |
| భీష్మపితామహుడు | 5 - 00 |
| వీరపాండ్య కట్టబ్రహ్మన్ | 5 - 00 |
| రాంప్రసాద్ బిస్మిల్ | 5 - 00 |
| శ్రీనివాస రామానుజం | 5 - 00 |
| నచికేతుడు | 6 - 00 |
| తెనాలి రామకృష్ణ | 6 - 00 |
| మహాసాధ్వి ద్రౌపది | 6 - 00 |
| తాంత్యా తోపే | 6 - 00 |
| సీతాదేవి | 6 - 00 |
| ఖుదీరాంబోస్ | 6 - 00 |
| మహాకవి కాళిదాసు | 6 - 00 |
| బీర్బల్ సహానీ | 6 - 00 |
| కేలడి చెన్నమ్మ | 6 - 00 |
| పరశురాముడు | 6 - 00 |
| లచిత్ బడ్‌ఫుకన్ | 6 - 00 |
| వాసుదేవ బలవంత్ ఫడ్కే | 6 - 00 |
| లవకుశ | 6 - 00 |
| ధ్రువుడు | 6 - 00 |
| కర్ణ | 6 - 00 |
| మదన్‌లాల్ ధింగ్రా | 6 - 00 |
| రాణాప్రతాప్ | 6 - 00 |
| చాణుక్య | 6 - 00 |
| అల్లూరి సీతారామరాజు | 6 - 00 |